గీ. తాసదా నిరాధారపతంగరీతిఁ, బరుగిడుచుఁ గరములు సాఁచి పరిఫలంబు
గోరకారోగ్యమును బ్రాణికోటికిచ్చు, నినుఁడు సన్మార్గసంచారుఁడనఁగవచ్చు.

—దామోదర సంభ్రమము—

కం. అప్పుడు తద్దామోదరుఁ, డొప్పగ శిష్యదధనంబు నొందిగృహిణిదా
నెప్పగిదినుండెనో ? యని, యప్పల్లెలు విడిచి వచ్చె నతిశీఘ్రముగన్. 138

గీ. అట్లువచ్చి నివాసము నంత వెదకి, యెచ్చటను భార్యఁగానక యెంతొ దిగులు
పొంది కొంపమునిఁగెనని తొందరపడి, జాడలేమి యుండగానక చదికిలఁబడె.

గీ. అట్లుపడి కొంతసేపటికెట్లొ లేచి
కర్మమెట్లున్నదో యట్లు గాక మాన
దనుచుఁ బాపరాజుఁగని మాయాఁడువాండ్రె
చటకుఁబోయిరో ? తెలియునే జాడ మీకు ? 140

కం. అనియడుగ నతఁడు కోపం, బునఁగని నీభార్య యెటకుఁ బోవునొ మాడన్
ననుఁగాపుచ్చితివే ! పా, మ్మనుమఁగఁ బరిసేయునాతఁ డతిలజ్జవడెన్. 141

గీ. అట్లు పడిపోయి పాపరాజన్నముదిని
మేడపైకిఁబోయిన వెనుక మెల్లగాను
వంటయిలుసొచ్చి యామంత్రి పాత్రయందు
నన్నమును దిను తనభార్య నట్టె చూచె. 142

క. కనిదుఃఖసముద్రంబున, మునిఁగి యశ్లైనిలువఁబడి ముమ్మరముగనూ
ర్పునుబుచ్చుచు నయ్యాదితసుఁ, గనినప్పుడు చూచిపలికెఁ గడుదీనతతో. 143

—కామినీ దామోదర సంవాదము.—

గీ. కాంత ! నాకూటిలోఁ దున్న గలిపిపరుని
కూడును దినుట తగునె ? సత్కులజ ! నీవు
నెన్నొ రూపాయలనుబోసి నిన్నుఁ గట్టు
కొంటి నాముప్పగడపకిట్లుంట తగవె ? 144

సీ. ఎవరికైనను బిల్ల నిచ్చెదన్న నిఁక దీని, నేలునా ? పిడని యీ నురనుచు
నమ్మివారున్న నూ న్యాబమ్మియాడుచు, మన్ననికఁ జనుట మన్నె యనుచు

నధికారికడ నీవు న్యాయంబుగోరినఁ, బదిరైయెన నెలకీయవలయు ననుచు
నిన్నింటికొడఁబడి యెట్లో పెండ్లాడిన, నదియెట్టి యోగ్యురా లగునో యనుచు
గీ. నెంత స్వేచ్ఛగా నీవున్న నేమియనక, యింతవండిగ్లైనను బెట్టు చిల్లునగని
పెట్టుకొనియుండు మనుచు నిర్భీతినుంటి, నిట్లయిన నన్నుఁగడ తేర్చి నిచ్చలేదె!

గీ. అనఁగఁ దద్దుష్టకామిని యనియెనిట్టు
లేల పేర్చెలెద పూరకే చాలుఁజాలుఁ
గామినికొకయౌవన మెముఖ్యంబుగాని
యమితధనధాన్యములును ముఖ్యములుగావు. 146

గీ. లేనిపోనిదురూహలు మానసమునఁ, బూనియట్టులిట్లనుచును బూర్వకాల
వాక్యములు సాహసంబుతోఁ బలుకకుమిఁక, నీకుఁ బ్రత్యుత్తరంబీయ నాకుఁ జెల్లె.

శా. రాకాచంద్రముఖుల్ నిరంతరరతి ప్రారంభసంరంభలన్
శ్రీకామాగమవాక్యరత్నముఖుధుల్ చెప్పన్విసన్ లేదె! య
స్తోకంబైన జరాభరంబుగల నీతోనుండ నెట్లోర్తురా?
నీకున్ నాకును నింతె యింకఁబదరా! నిర్భాగ్య దామోదరా. 148

—దామోదర పాపరాజ సంవాదము.—

గీ అనఁగ దామోదరుండు నిరాశనొంది
పాపరాజునొద్దకు వచ్చి పలికె నిట్లు
నాదు భార్య హరించుట న్యాయమగునె?
యిచ్చివేయుఁడు! కరుణించి యిదెమ్రొక్కు. 149

గీ. అని నమస్కరింపఁగ నాతఁ డనియెనిట్లు
నీదు భార్య నేను హరింపలేదు మాగృ
హమున నున్నచోఁ దోడ్కొని యరుగుమయ్య
యేను వీసమంతైనను నెఱుఁగ దాని. 150

గీ. అనఁగ దామోదరుండిట్టు లనియె మీగృ, హమున నున్నది నాకురా నన్నదనఁగ
నీగృహిణి నీకు రానన్న నేనుఁ జేయ, వలసినదియేమి? యనివలెఁ బాపరాజు.

— దామోదరస్వగృహగమనము.—

కం. అనుటకుఁ జింతిలి యాతఁడు, మనవస్తువు మంచిదైన మర్యాదగతిం
చునె? మనకర్మంబిట్టిది, యని ధైర్యము పూని చేరె నాత్మపురంబున్. 152

—ఆశ్వాసాంతము.—

వ. అట్లాహ్లాదామోదరుండు పోయిన తరువాతఁ దత్ప్రమినీపావరాజు లత్యంతసంతోషాక్రాంతస్వాంతులగుచు, హంసతూలికాతల్పంబుల శయనించుచుఁ, గామవిద్యాకౌశలంబులు మెఱయ సర్పాదిబంధరతులం దేలుచు సుఖముగా నుండిరి. 153

—సర్పబంధము.—

చం. ఘనకపిధామ! మానసనిధి! కృంధిశ! సన్నుయితీతియూలు! పా
వనబలవీశయాన! హతపాతక! కీర్ణమపూడివాన నిగా
గనమతిసేవితా! నరవరా! వరసత్రకిశయా! పినాకిహ్న
ద్వనరుడినా! యనూనవసుధా సురలక్ష్మి విశాలలోచనా. 154

—గద్యము.—

ఇది శ్రీమదాపస్తంబసూత్ర, కౌండిన్యసగోత్రపవిత్ర, సుబ్బనశాస్త్రిపౌత్ర, నారా
త్రిపుత్ర వేంకయార్య ద్వితీయపుత్ర, బాపనార్యపౌత్ర, చి. సర్వగుణా
ద్వ్యేకాదశాబ్దపోషితపుత్ర, సీతయార్యస్వకన్యాపుత్ర, సకలజన
కారుణ్యకటాక్షపాత్ర, సీతారామచంద్రపదాబ్జాస్త్రద్ధి
సకలకర్త, సూర్యనారాయణమూర్తిశాస్త్ర ప్రణీ
తంబై, యపూర్వద్యుతి చరిత్రయగు
సకలానందనామక
నవీన ప్రబంధమునందుం
బంచమాశ్వాసము.

—

శ్రీరస్తు.

సూర్యనారాయణమూర్తీయము.

# సకలానందము.



## షష్ఠాశ్వాసము.

క. శ్రీమద్దైవమవయ్యును, రామేశ్వరసుప్రతిష్ఠ రాజితభక్తి
శ్రీమతినొనరిచిలోక, స్తోమమునకు నీతిరీతిఁ జూపిన రామా. 1

వ. దేవా! దివ్యచిత్తంబున నవధరింపుమట్లు చెప్పఁగా వినియవ్వలికథఁ జెప్ప
ముని యడిగిన శౌనకాదులకు సూతుం డిట్లనియె. 2

గీ. ఇట్లు మన్మథరాజ్య సౌఖ్యములు గనుచు
దాని భార్యగాఁ గైకొని తనరుచున్న
పాపరాజును వెలివేసి పరమనూత్న
రాజువానిగర్వపరిహారంబు చేసె. 3

గీ. ఇంటనుంచక పెండ్లాము నెల్లచోట్లఁ, ద్రిప్పినట్టి వైష్ణవుగ్రహ మెప్పగిదినిఁ
గూలెనో వింటిరే! దీనిఁ గూర్చి యొకటి, విపులధర్మశాసనము చెప్పెద వినుండు.

క. పడఁతుకలందఱు నిట్టులె, చెడిపోవుదురనుట గాదు; చెడ్డయు బాగుం
బడయుటకు వేషభాషలు, నడవడికయు మూలకారణంబులు సుండీ. 5

క. అనిభక్తింజిత్తంబున, ఘనతరలోకోపకార కార్యాచరణం
బున బ్రతికియున్నయట్లొ, ప్పిన మునివరులఁ దలఁచి వినిపింపఁబోడంగె

తద్ధేయము.

# కామినీధర్మశాసనము.

## ప్రథమగుచ్ఛము.

స్త్రీలతిచంచలల్ గనుక చేకొనిభర్తలు వారి సర్వదా
పాలనఁ జేయుటొప్ప నను పద్ధతిలోకు తెలుంగు నిచ్చ స్వ
స్త్రీలను వక్త్రహృత్తనులఁ జేరుచుకొన్న త్రిమూర్తులుంజగ
త్పాలనగండ్రు గావుత మపారకృపారసవారధారులై. 7

క. ఈరీతిని నిఖిలజగ, త్కారణులకు మ్రొక్కి చెప్పఁ దలఁచినగృహివి
స్తారతరక్షేమకర, స్త్రీరక్షణధర్మశాస్త్రరీతి యెటన్నన్. 8

—గృహస్థవిషయము.—

క. భగవత్సృష్టంబగు నీ, జగమునఁ బురుషార్థములను సంపాదింపం
దగిభాసిల్లెడు నదియు, కగు గృహస్థాశ్రమమె చుండు ఘనమునులారా. 9

క. అతిథులు నభ్యాగతులును, యతులును మొదలైనవారి నన్నాదులచే
నతితృప్తినిఁ బొందఁజేయు, నతఁడే గృహస్థుఁడనఁ నొప్పు నవనీస్థలిలోన్. 10

క. ఆయితిథులు మన్నగువా, రేయెడ శుద్ధాన్నము దిన నెంతురు గానన్
శ్రీయుతవర్ణాశ్రమగతిఁ, బాయక గృహియుండవలెను బరిశుద్ధుండై. 11

క. ధరణీస్థలిని గృహస్థుల, పరిశుద్ధతయెల్లవేళ భార్యలపాలై
పరఁగును గావున భామలు, పరిశుద్ధలు గావలయును బటునియమమునన్. 12

క. ఈవిషయంబును గూరిచి, దైవసమానులననెసఁగి ధాత్రీనిజనసం
భావితులై భాసిల్లెడు, పావనమౌనులు పలికిన పలుకులు వినుఁడీ. 13

—శాతాతపమహర్షి వాక్యము—

మ. పవిత్రదీక్షాదుల నగ్నిహోత్రముఖసంరక్షశుశ్రూషలం
బతిథివ్రాతము పూజలందు ముద మొప్పారంగ భర్త్రాజ్ఞయం
దతులశ్రద్ధయుభక్తియుక్తి నెలయు శుద్ధాచారసత్కార్యయై
యుతదోషేతులు లేని భార్యగలవాఁడే సద్గృహస్థుండిలన్. 14

—సుమంతుమహర్షి వాక్యము—

క. పరిశుద్ధాచారములరఁ, గరుణాభక్తులు పతిపయిఁగలిగి సువృత్తిం
బరఁగుచుఁ బతికులధర్మము, పరిపాలించుసతిపతియె వరగృహిధరణిన్. 15

—శంఖమహర్షి వాక్యము—

చ. అతఁడు ఘనార్చనంబుల పవిత్రాచరణంబుల నగ్నిహోత్రస
త్క్రతులను వేదకర్మములఁ బ్రేమున గల్గినవాని కోరుకుల్
హితవుగఁ దీర్చువారు సతులేయగుటన్ సతులెస్సు నుత్తమ
వ్రతలుఁగులీనలుం బతిపరాయణచిత్తలుఁ గావలెన్ ధరన్. 16

—యమమహర్షి వాక్యము—

చ. అతిశుచిసద్గుణాఢ్యయుఁ గులానుగధర్మయునైన కాంతకున్
బతియగువాని యన్నము దినంగఁ దలంతురు సాధులెప్పుడున్
బతికతిశత్రువై యశుచివర్తనయౌ సతియన్నముం గనం
దతపరిశుద్ధవేదములుఁ దాల్చుభయంబును భూతలంబునన్. 17

గీ. కాంతినిచ్చుఁ బతివ్రతకరము కూడు
పురుషమర్యాదయెల్ల సుందరులపాలు
గాన వారికి సుగుణముల్ గలుగుమార్గ
ములను జెప్పెద స్థిరచిత్తములను వినుఁడు. 18

—ధర్మసంగ్రహవాక్యములు—

సీ. అత్తమామల సేవ లాచరించుటయందు దేవతారాధనాదికమునందు
నతిథిజనంబుల నర్చించుటందును జ్ఞానవృద్ధుల పరిచర్యలందు
నాత్మీయ పాదసేవాదులయందును గోమహిష్యాదుల నోమునందు
నన్నపానాదుల దిన్నపఱుచుటందు గృహపరిశోధన కృత్యములను
గీ. నెల్లపుడు నియమించును నితరబుద్ధి
పుట్టకుండెను నట్లుగాఁ బుణ్యమొందఁ
దలఁచుకొన్న గృహస్థులు తమ గృహిణుల
నెంతొ బాగ యూకతతోడ నేలవలయు. 19

—యమమహర్షి వాక్యము—

ఉ. ఏపనిలేని కామిని గతిస్పృహదా పరుఁ జూచి మోహనం
తాపము చేత భర్తను ఘనంబుగఁ దిట్టుచు బుద్ధిలేక యే
పాపముఁ జూడ కెట్టిమగవానిని నొందఁగఁ గోరుఁ గానఁ దా
మేపనియందొ యుంచవలె నెప్పుడు భార్యలఁ బూరుషోత్తముల్. 20

—శంఖలిఖితమహర్షి వాక్యము—

సీ. ఎల్లప్పుడును బుట్టినింటనే యుంచరా దితరుతో మాట్లాడ నీయరాదు
దుర్మార్గవనితలతోఁ గూడ నీరాదు బహుజనస్థలములకుఁ బంపరాదు
బహుదినంబులు దాను నాసియుండంగరా దొంటిగాఁ దాను పవుండ రాదు
పాటలాటలుగలపట్ల కంపఁగరాదు చెడుపైనకథలు వచింపరాదు

గీ. భార్యల నిటులఁ గాపాడవలయు మగలు
లేనియెడ వారు చెడి తమ మానవంశ
కీర్తిఁ సంపదలు చెఱిపి యార్తినొంది
యిహపరంబులకుఁ గొఱగా రింత నిజము. 21

క, తమపరమబంధుమిత్రగృహములఁ జరిగెడు సభసమయములఁ గృహిణులం
దమతోడఁ దీసికొనిన, చ్చిమఁజల మగవారలిల్లి సేర్పఁగవలయున్. 22

— వ్యాసమహర్షి వాక్యము —

క. కామినులు చపలచిత్తలు, కామాసక్తులును దుష్టగమనలుఁ గానన్
భామిని స్వేచ్ఛనొసంగిన, చోమర్యాదనశించును సుదతీతతికిన్. 23

క. ఘనసౌందర్యముగల సుత, జనకభ్రాతలనైనఁ జూచి చలియింతురిలన్
వనితలు సుందరుఁడగుపతుఁ, గనునప్పుడు వారి చిత్తగతి యెట్లుండున్. 24

క. కావునఁ బురుషులు సతులకుఁ, బూవులు తాంబూలములును బూజ్యపునగలున్
శ్రీవస్త్రంబులు నిచ్చుచు, నేవేళను గృహమునందె యౌనసఁగింపవలెన్ 25

— సుమంతు మహర్షి వాక్యము —

క. ఘనమగు నమ్రికవానికి, మనసగునట్లు నిజగృహిణి మసలంగాని
చ్చినమర్త్యుఁడు పురుషాధముఁ, డనిస్పష్టముగా వదించి రఖిలమహర్షుల్. 26

ఆ. "పాలఁ తిరావనవహిన్ని పురుషుఁ డాజ్యఘటంబు, కరఁగకుండ దాదు కదసెనేని
బ్రహ్మకైనఁ గూఁతుఁ బట్టక మానఁడు," సత్యమిద్ది వేద సమ్మతంబు. 27

క. కనుక నాకంఠమున బరకాం, తను జేరఁదగదు పురుషుఁడు; తరుణియుఁ బరపు
ర్దను జేరఁదగదు; నియమము, చనె నేనిమఖల గొనుట యసాధ్యంబిలలోన్.

చ. వనదళవాతముల్ మెసవువారు పరాశరకౌశికాదులా
ఘనులును సుందరీజనులఁ గన్గొని మోహితచిత్తులైరి పెం
చ్చినఘృతపాయసాన్నము భుజించెడు వారలకున్ మనోజయం
బు నెగడునంటయూగగనపుష్పసహోదరధర్మమే గదా. 29

క. కానన్ సద్గృహమేధికిఁ, బూనికఁ దత్త్వోపదేశమున కైపరుఁడై
మానవునొద్దకు భార్యను, బోనిచ్చుట పాపకరము భూతలమందున్. 30

—సుబుద్ధిచరిత్ర.—

చ. మునుపు సుబుద్ధినాము ముని పుత్రుఁడు జ్ఞానధనాఢ్యుఁడౌ కెఱఁడం
దనపినతండ్రికూఁతునకుఁ దత్త్వము చెప్పదు దైవకారణం
బునరతిసల్పి పిమ్మటను మోసమెఱింగి తపించి లింగముం
దునియలు సేసి పట్టుకొని తూరుపుగాఁ జనుచుం మృతింగనెన్. 31

క. సతులకుఁ దత్త్వార్థముపై, మతియుండిన జ్ఞానవృద్ధమానినులకడం
బతులకడనొందవచ్చును, నితరులకడనొందఁ బోను టెంతయుఁ దప్పౌ. 32

—భృగుమహర్షి వాక్యము.—

క. పరభార్య తన్నుఁగూడిన, పరపురుషుని వంశమెల్ల భంగముసేయుం
బరవీర్యము తనుఁబొందిన, పరభామిని వంశమెల్ల భంగముసేయుం. 33

గీ. పరపురుషునివలనఁ గాంత వడసినట్టి
మాకాంతపతియందు నెలయుబ్రహ్మ
తేజమును జంపినైచను ; దీనిపేర
చెడిపె మగని జనులు గొప్పసేయరినుట. 34

క. తమభార్యలందుఁ బరవీ, ర్యము పడుటయె గొప్పపాపముగఁ గాననరుల్
రమణులఁ గాపాడవలెను, కుమఁబుంశ్చలిపొందకుండఁ జన్పుట మేలౌ. 35

చ. ధరణిని లంకలాఁడియగు దారనుగూడుటకన్న మంచి సా
మరణము, సన్న్యసించుటయు, మానితమౌ పరదేశవాసముం
వరగతి నీచమార్గమును భామలు పొందుటకాద హేతువుల్
పురుషులె కాన భార్యలను బూజ్యగతిం నియమింపఁగావలెన్. 36

—మనుచక్రవర్తి వాక్యము—

గీ. స్త్రీశిరఃకేశ మొకటి దేవునొద్దఁ
బడిననా దేవతామూర్తిఁ బ్వరగఁ దగ్గు
మఱియు దానిమగఁడు చచ్చి పుత్త్రులఁ బుట్టి
వెండ్రుకలనెభక్షించి జీవించుచుండు. 37

క. కావున నిహపరసుఖముల, కైవర్తించు మగవార లాత్మస్త్రీలం
గేవలనుములలోనికి, నేనేళంబంపకింట నేయుంచవలెన్. 38

బలిహరి గనుక నీఘనవ్రతము బూను
నామె యుత్తమలోక సౌఖ్యంబులొందు. 54

—శాతాతపమహర్షి వాక్యము—

గీ. మృతుఁడయిన సన్న్యసించిన బ్రతికియున్న
సతికిఁ బతియె దైవముగాన శ్రద్ధతోడఁ
బతిని ధ్యానించుచును నుపవాస ముఖ్య
పావనవ్రతములు సేయవలయు విధవ. 55

క. ఈరీతి నాచరించెడు, నారీమణికీర్తి నొంది నారాయణస
త్కారుణ్యకటాక్షముచే, శ్రీరాజన్మోక్షపదవిఁ జెందుసుఖంచున్. 56

—గుచ్ఛాంతము—

క. చలనరహిత యలిహృద్గత, లలితాకృతి! సర్వమంగళావాణీమం
గళదేవతాధినాథ! స, కలలయసృష్ట్యవనకార్య కారణకారా. 57

—గద్యము—

ఇది

శ్రీమన్మహర్షి నింహప్రణీత కామినీ
ధర్మశాసనమునందు
సర్వంబును బ్ర
థమగుచ్ఛము.

శ్రీ.



—మహర్షిశాసనచర్చ—

గీ. స్త్రీపశునియందు నాసక్తిఁజెందదేని, నింటివ్యాపారములు నశియింప, దాస
నిహపరవిహితధర్మములెల్లఁ బోవు, ననితపసులిట్లు పలికిరి ఘనగతులను. 59

—గృహస్థాశ్రమ వైకల్పికత్వము—

క. గురుకడవిద్యాభ్యాసము, జరుపుచుఁ జిత్తంబు నిష్ఠఁ జలనరహితమై
పరఁగినఁ బెండ్లాడక యా, గురునికి మృతినొందు దాఁకఁ గొలువఁగవచ్చున్.

గీ. స్నాతక వ్రతుఁడై బ్రహ్మచర్య నిష్ఠ
కుదిరెనని సన్న్యాసము గొనఁగ వచ్చుఁ
గుదురకున్న గార్హస్థ్యము గొనఁగ వచ్చు
నిష్టమైన మార్గంబున నేగవచ్చు. 60

గీ. బ్రహ్మచర్యగృహస్థతారణ్యభూమి, వాససన్న్యాసములయందు భామఁగూడు
నట్టియొకగృహస్థాశ్రమ మదినియమిత, కాలసంగమధర్మంబు గలిగియుండె.

వ. అధికమాయా స్వరూపమై, నిద్రాహారమైథునసీచకర్మబద్ధంబై, జననమరణాద్యనేక దుఃఖహేతు భూతంబైన యీస్థూలశరీరమును దృణప్రాయముగా నెంచి, శాశ్వతసౌఖ్యప్రదమైన ముక్తిని సకలజన గమ్యస్థానముగా నిర్ణయించి, యాముక్తిసాధనమైన మనోబలము, నామనోబలసాధనమైన యుత్తమ తపస్సు, నాతపస్సాధనమైన యోగనిష్ఠయు, నాయోగనిష్ఠాసాధనమై యాయుర్బలకాంతి హేతువైన వీర్యస్తంభనంబును, నావీర్యస్తంభనసాధనమైన, కామక్రోధ మదమాత్సర్య గర్వాదిదుర్గుణ కారణమాంసాద్యశుచిపదార్థేతరసాత్త్విక పదార్థభోజన స్నానాచమన హోమసత్యవాక్య వ్రతభూతదయాదికాయిక వాచికమానసికోచిత పరిశుద్ధాచారకాండమును, ముఖ్యధర్మములుగాఁజేసి, సకలవిధముల వీర్యము వ్యయముగాకుండునట్టి నియమములనే లోకోపకారార్థము మహర్షిపుంగవులు నియమించినారు. దేశకాలస్థితులను బట్టి వీనిలోఁ గొలఁదిమార్పులు చేసినను గమ్యస్థానములు మాత్రము చెడలేదు. "మాంసంమాంసేనవర్ధతే" యని వైద్యశాస్త్ర మందుఁ జెప్పి, పితృక్రియలయందు మాంసము పెట్టవలెనని ధర్మశాస్త్రములందును, సకలసమగ్రులైన వసిష్ఠాదమును లొకప్పుడు మాంసముదినిరని పురాణములయందును వ్రాసిన మహ

ర్షులే మోక్షసాధనధర్మ ప్రధానులైన ద్విజాతులకు మాంసభక్షణము గూడదని యాచారమేర్పఱచుట చూడఁగా వారిసంఘసంస్కరణ విశేషము చక్కగా బోధపడుచున్నది. ఇట్లు భూలోకజన కర్తవ్యమును బూనిన సంఘమే పూర్వాచార పరాయణపరమని పిలువఁబడుచున్నది. ఇట్టియుత్తమశాసనములయర్థమెఱుఁగక, నిఘంటుకారులు వ్రాసిన గ్రామ్య ధర్మశాస్త్రార్థమునైనను విచారింపక, సంగనుమే బ్రహ్మానందప్రదమైన మోక్షమని యెంచి కాలక్రమమున నుపయోగజ్ఞానశూన్యులైన కొందఱు పూర్వాచారపరాయణులం జూచి మహర్షులనిందించుచు, మోక్షమనునట్టిదో యెఱుంగక మొన్నమొన్న కన్నుఁదెఱచిన కొందఱు విదేశీయుల బాహ్యసుఖాచారములం బ్రమాణములుగాఁ దీసికొనుచుఁ, దమవిద్యాబలంబును బూడిదెలోఁబోసిన పన్నీరువలెఁ జేయుచుఁ, దమయూహలు మహర్షుల సమ్యస్థానోచిత ధర్మములచే దకారణములని యెఱుంగక యీకలిప్రజలు విధవయేల పెండ్లియాడఁగూడదని కామవాదంబులు సేయునంతటి దుస్థితికివచ్చినారు. 62

—పండితాపార్థసామర్థ్యము—

సీ. పరలోకమతిగడ్డపఱిగంతయునులేక భారస్వరాజ్యముగోరునొకఁడు
కమలాక్షునామంబు కలలోసనుబలికంప కందులోనేమున్న దనునొకండు
జపతపంబులు సేయు సద్బ్రాహ్మణులఁజూచి యేమిపిచ్చియిదనియెంచునొకఁడు
మహితధర్మాన్వితమతరీతులనుజూచి యిదవట్టిమాటని యెగసురునొకఁడు

గీ. డయ్యయో! భగవత్తుల్యులైన మునులు
మసలినట్టి యీభారతమాతగర్భ
మందునెంత ప్రయోజకులైన సుతులు
పుట్టిరక్కటా! కలి పుట్టె మందమందె. 63

సీ. ఆత్మప్రకృతిపీస మంతయునెఱుఁగకే ప్రకృతిశాస్త్రిననుచుఁబలుకునొకఁడు
జననమరణముల సంగతియెఱుఁగకే నాగరికుఁడనందు నడుమునొకఁడు
బ్రహ్మచర్యప్రభావంబునెఱుంగకే మతకర్తనని ముదంపడునొకండు
స్వర్గనరకములజాడల నెఱుఁగకే బ్రహ్మవేత్తనని గర్వపడునొకఁడు

గీ. డయ్యయో! భగవత్తుల్యులైన మునులు
మసలినట్టి యీభారతమాతగర్భ

ముందు నెంత ప్రయోజకులైన సుతులు
పుట్టిరక్కటా! కలి కొంప ముంచుచుండె. 64

—వితండావాదఖండనము—

గీ. ఈడువచ్చిన వెనుక స్త్రీఁగూడకున్న, జబ్బు సేయునందురు కొందఱబ్బురముగ
నైష్ఠికబ్రహ్మచారులైనరుల నేకు, లీయిలను బూర్వమునఁ జరియింపలేదె? 65

గీ. అది యుఁగాక యూహారసంగాదులాడి, యుండుఁదల్లిదండ్రులు నేర్ప నబ్బునందు
నెట్టులలవాటు చేసిననట్లె నడుచు, నీశరీరస్వభావమే యిట్లనుండు. 66

గీ. వాయు వాహారముగఁ జేసి వరతపంబు
సేయు పురుషుఁడయిన బుష్యశృంగమౌని
వారకాంతలఁ జూచి తపసు లటంచు
మొఱకెక్కెనఁట, యిట నేమయ్యె భుక్తిరతులు? 67

గీ. కొందఱన్నవస్త్రంబులు కుదురకున్న,
జపతపంబులు నిష్ఠయు సలుపుటెట్లు?
గావునస్వరాజ్యము ప్రజకుఁగావలెనని,
పలుకుచుందు రార్యులు నిట్లు పలుకఁ దగునె?

సీ. ఇతరదేశసంవాసుల నెల్లఁదనవి, భవముచేఁ బెంచుచున్న యీభరతమాత
ధర్మబుద్ధులై యున్న చోఁ దనతనయుల, కన్నమును బెట్టి రక్షింపకున్నె యున్నె?

ఉ. "ప్రాణిక సేయువాని సిరిపొందును, దైవము హేతువంచుదు
ర్మానసులంచు, దైవమును మానక కొల్చి స్వశక్తితోఁగృషిం
బూసిన యుప్పుడద్దిచెడిపోయిన దోషము లే"దటన్న శ్రీ
నిర్వాణమతంబు గుర్తెఱుఁగు మతుల్యాలు సంపదఁబొందకుందురే? 70

గీ. ఎదుటనున్న గంగనుమాని యొటకొ పోయి
బురదగుంట నీటిని దాగు పోల్కి స్వమత
శత్రులై పరమతరీతిఁ జను తనయుల
పైని భారతమాత కోపమ్ము పడదె? 71

గీ. పెద్దలైనమునుల నీతి విడిచి, మాతృ, పూజమాని, దుస్పృహవాసమునఁ దెగించి,
చెప్పినట్లు వినక యున్న చెడుకొడుకుల, భరతమాత బాధలపాలు పఱచకున్నె.

క. సారబ్రహ్మానందా, పారాంభోనిధితరంగ భాసురడోలా
వారితసుఖమానసులగు, వారికిబాహ్యస్వరాజ్యభారం బేలా? 73

—ప్రజాకర్తవ్యము—

క. శాసనమున్న విధింబుల, హీనస్థితినొందియున్న యిప్పటిజనముల్
మానక యీశుభవేళను, జ్ఞానప్రదశాస్త్రరీతిఁ జరియింపఁదగున్. 74
క. మునుపీదేశము నేలిన, మనరాజులు శాస్త్రరీతి మానితదయతో
మనుజులనీతిపథంబునఁ, జనఁజేయుచుఁ దాముఁ జనిరి సత్పుణ్యగతిన్. 75
గీ. అట్టి రాజశాసనము నేయనుసరించి, యిప్పుడుండిన ప్రభువులు నేలుచుంటఁ
గామినీధర్మశాసనగతినిజనులు, నీతిని నిలువఁ జేయుకొనెదరుగాక. 76
క. అనఁగా విని శౌనకుఁడిట్లనె సూత! నీవుచెప్పినట్టిసునీతుల్
ఘనసంతోషము గలిగించె, చినదింక నొకదాని నీవు చెప్పఁగవలయున్. 77

—స్త్రీకర్మాధికారప్రశంస—

గీ. ఆఁడుది పురుషుని శరీరమందు సగము
భాగమే గదా! పురుషుని వలెనదియును
జందెము ధరించి కర్మముల్ సలుపకుండు
టేల? యట్లాచరించిన నేమి తప్పు? 78
కం. అనఁగా విని సూతుండిట్లనియెను లోకోపకారమగు మీప్రశ్నం
బునకుత్తరమును జెప్పెద, ననుపమమతిసావధానులై వినుఁడు మునుల్. 79
కం. లలితాలంకారములగు, తలవెండ్రుకలుంటవలనఁ దరుణీమణికి
యిలలోఁ గంఠస్నానమె, యలఘుసుఖప్రదమని మునులాడిరి మఱియున్. 80
గీ. సూతికాదిదోషంబులు చొచ్చిగృహము
గాను వాతతత్వముగల దానిఁగాను
వైద్యశాస్త్రముచెప్పెఁ గాఁబట్టి భామ
స్నానమును జేయఁదగ నెట్టిసమయమునను. 81
గీ. నెలకుఁగానియొకప్పుడనియమముగను, గాని స్త్రీబహిష్ఠయగుటగలుగునపుడు
దానిమేనుచలువఁ జేయుఁ గానఁదాన, మాడుటకిసుమంతయును ననర్హురాలు.
గీ. దినదినంబును జందెము దీసివేయు, టెట్లు? పారిశుద్ధ్యము లేకయెట్లు కర్మ
మాచరించుట? నిష్ఠనెల్లపుడుఁ దాల్చి, వంటిపిల్లల నరయుచు సాఁకుటెట్లు?

—వేశ్యావృత్తాంతము.—

కం. వినుఁ డెఱిఁగించెద నెంతయుఁ, బనివడి గణికాజనంబు పద్ధతు లెల్లన్
వినయంబలరారఁగ నో, ఘనులార! సవిస్తరంబు గా నిఁక మీకున్. 93

గీ. ప్రముఖదీర్ఘనరులు తమ పుత్రికలను, దేవునకు నీయఁగా వారు దేవతాల
యముల నాట్యముసేయుచు నంతనుండి, దేవదాసురాండ్ర నఁబడి రీవసుధను.

గీ. అప్పుడు జితేంద్రియలగుచు నలరుచుండి
క్రమముగా మగవారి యక్రమము చేతఁ
గామసంచారిణులగుచు గణికలనెడి
పేరు దాల్చి యీరీతి వృత్తిఁ గొనిరి. 95

—వేశ్యాదుర్వృత్తి.—

ఆ. "విటుఁడు లేని రేయి వేదనఁ జెందుదు, నిదుర కంటి కెఱుఁగ నేరకుండి
కాసొసంగునట్టి కడజాతివాఁడైనఁ, గలుగఁ గోరు వారకాంత మదిని." 96

సీ. కడుఁ గురూపి నైనఁ గందర్పనిభుఁడంచు, నభినుతి యొనరింతు రలఘులీల
నంత్యజన్ముని నైన నమలవంశజుఁడంచుఁ బలుకుదు రెంతయుఁ బ్రౌఢి దనర
నతిమూఢమానసుఁ డగుమానవుని నైన నరసుఁడటందురు సరభసమున
బ్రహ్మహంతకు నైనఁ బరమధార్మికుఁడంచు, గణుతింతు రెపుడు నుగ్రమముతోడ
గీ. నెన్నఁగల్గిన నీతివిహీనుఁడైనఁ, దవిలి సద్వర్తనుండండ్రు దమకు నొక్కఁ
డీసమైనను గాసైన వీడమైనఁ, జేతి కొసఁగినచో వెలచిఱుఁబోండ్లు. 97

ఉ. చిన్నెలవన్నెలన్ వగలఁ జిత్రవిధంబుల ముద్దుమాటలన్
వెన్నెల నెన్ను నవ్వులను వేమఱు బిత్తరివాలుఁజూపులన్
సన్నలసైగలన్ మిగుల జాణతనంబున వారకామినుల్
చెన్నగఁ బల్లవప్రతతిచేత ధనంబును దోఁతు రెప్పుడున్. 98

సీ. ఒకమాఱు పయ్యెద నోరగాఁ దొలఁగించి, నవరించు జిగిగుబ్బచన్ను లలర
నొకమాఱు సోగవెండ్రుకలబల్ నును గొప్పు, నడలఁ జల్లున విప్పి ముడుచుచుండు
నొకమాఱు మణిమయ ప్రకటభూషణములు, వదలించి తిరుగఁగఁ గుదురుపఱుచు
నొకమాఱు నవ్యసూక్ష్మకమణీహారముల్, కొనగోటఁ జిక్కుఁ బుగుచ్చి తివియు

గీ. తెలిఁగిమతియును శృంగార చేష్టలలరఁ, గేరుచుండును బెళుకు విహారములను
సొబగుమీఱినవగకానిఁజూచినపుడు, మరులుకొల్పును వెలయింతి మహితగతిని.

చం. పొలుపుగ నిన్నుఁ బాసియొక పూఁటమహాయుగ మంచు నెంచుచో
వలనుగ నీవు నన్నిటుల వంచన సేయఁగఁ బాడియే? యెటుల్
దలఁపఁగ నీతియే? యనుచుఁ దక్కుచుఁ జొక్కుచు నిక్కువంబుగా
వలచినయట్లు మాయలను వారవధూటి భ్రమించుఁ బల్లవున్. 100

చం. ధనములవేల పోయిపుడు దాసియునైన గడించు నీక్రియన్
ఘనముగ మాకు నీ చెలిమి గల్గుటయే పదివేలటంచుఁ బె
న్వినయపు మాటలాడుచును వేడుక కానిఁ గరంగఁజేసి యొ
య్యన విభవంబు గొల్లఁగొను గణికాంగన లెంతయు నేర్పుమీఱఁగన్. 101

కం. వలచినవానికిఁ బడఁతియు, వలచినచందంబు దోఁచ వలవదు గాకం
దులనైన వెలపొలంతికి, వలపును గనకంబునకును వలపును గలదే? 102

—వేశ్యామాతృవర్ణనము.—

సీ. పల్లవవ్రాతంబు పాలిబల్ రాకాసి ప్రకటితోద్యన్మద్య పాననిరత
గురుతరానేకదుర్గుణగణాలంకార, సకలమాయావాదజననసీమ
ఘోరకోపవికారపూరితనిజచిత్త, కఠినవాక్యక్రియాగ్రధితరసన
ధరనసీతులకెల్ల గుఱుతుమీఱినతావు, దానధర్మదయావిధానహీన
గీ. శాకినీభూతబేతాళ సముదయైత్య, భీకరాకార విజయగంభీరనినద
సుమశరారామమార్గభాసురసమగ్ర, లగ్నకలకంఠయుతవల్లి లంజతల్లి.

సీ. కాఱుచన్నై తఱుచుగా నెరసిన వెండ్రుక, గొప్పమీఱఁగదువ్వి కొప్పుముడిచి
యిలఁబ్రాఁత చెప్పుటట్లఁబోలి వ్రేలాడు, కుచములరవికె చేఁ గుదియఁబట్టి
లోడిగినకౌసుంబు వడువునమడతలే, ర్పడియెడు నొడలిపైఁ బసపు రాచి
యొలుఁగుఁగోలును మీఱియెంతయు మాసిన, పెద్దపుట్టముచాలఁ బ్రీతిఁ గట్టి

గీ. బొరుసునోసటను జంద్రింబు బొట్టువెట్టి, యడసుకన్నులఁ గజ్జలం బడరదిద్ది
బోసినోటను దమలంబు పూనియిటుల, విటులఁ బలుమాఱు నగఁజేయు వృద్ధవేశ్య.

గీ. పద్మమైనను దగు మహాపద్మమైన, శంఖమైననొసంగినఁ జాలకుండి
ధనదు మెచ్చకొంతైనఁ దనకుఁగల్గు, విత్తమంతయు నీకున్న వేశ్యజనని. 105

కం. వసదాగినపులుఁగుఁ గికియక, విసువక తగఁ బ్రేలుకొనుచు వేశ్యాంబకడుం
బెసరేఁగి బూతులాడుఁ, బసగల్గనియోగియణఁగఁ బల్లవతతులన్. 106

ఉ. ఆవులుపోఁకలున్ మణులు హారములున్ బహుగంధసారముల్
కోకలు రూకలున్ మదినిఁ గోరినయట్టి సమస్తవస్తువుల్
బ్రాకటమొప్ప మ్రాయలోగిఁ బన్ని భ్రమించుచు నేర్పుమీఱఁగాఁ
జేకొనుఁబో విటావళులచే గణికాంబ విచిత్రవైఖరిన్. 107

సీ. మిండఁడొకనాఁటిరేయి రాకుండెనేని, గానుపీసంబు చేతికిఁ గల్గనఁడు
కించుకేనియు నిదురఁబోనీదు కూఁతు, గడనఁ బూఁబోఁడియవ్వ పెట్టెఁ గంచుమువ్వ.

—ఆర్యజనపాపరాజులు.—

వ. ఇట్లు భర్తృగ్రగణ్యులైన మహాకవులచే దృణీకరింపఁబడిన వారకాంతలం గడజాతిగాఁ జేసి, యుత్తమబ్రహ్మచర్యనిష్ఠాగరిష్ఠులును, సంఘసంస్కరణకర్తలును, లోకోపకారపరాయణులును నగు మహర్షిశ్రేష్ఠులు పశుసంయోగప్రాయశ్చిత్తమే వేశ్యాసంగునకు నియమించిరి. అట్టినియమమును లక్ష్యపెట్టక రాజ్యమదాంధులైన కొందఱుప్రభువులజ్ఞానులై వారకాంతలను దమ భార్యలంగాఁ జేసికొనుచు వచ్చిరి. 109

—ఆర్యహీనదశాదికారణము.—

గీ. అట్టిరాజులప్రోత్సాహమంది వేద, శాస్త్రములఁ బురాణములనెసఁగు నీతి
గొనక యతిశయోక్త్యలంకారమును రచించి, వారిఁ బొగడఁ దొడఁగిరి ద్రవ్యపరకవులు

గీ. అంతతోఁ దృప్తినొందక యజ్ఞతఁ జెరుఁ, గఁ బరకీయారసాభాసగతులు చేసి
పచ్చిబూతులబుంగప్రబంధములను, జేయుచును దాముఁ బ్రభులతోఁ జెడిరి వారు.

వ. అట్లు బయలువెడలిన కవిత్వములను జూచి యసాధ్యధర్మంబులం బోధించు వేదశాస్త్రపురాణములకంటెఁ బ్రత్యక్షసుఖధర్మంబులం బోధించు తత్కావ్యములనే ధర్మశాస్త్రములుగా గ్రహించి. 112

సీ. ఆరసాభాసము జారత్వమువలన దోషంబులేదని తోఁపఁజేయఁ
నతిశయోక్తిపురాణమందలికథలెల్ల నిక్కివేయనునూహ పుట్టఁజేయఁ
బరకీయవర్ణించు భావంబు విధవను బెండ్లాడవచ్చునన్ విధినిఁ దెల్ప
బహుకృతిషష్ఠ్యంత పద్యముల్ ప్రభుకంటె విష్ణుండులేఁడని వెల్లడింప

గీ. సతతసంభోగమార్గ సంచారులైన, భార్యలవిడిచి సంతతింబడయక పర
లోకమతివీనమంతయులేక, కాంతి, బలచిరాయుర్విహీనులై ప్రజలుచెడిరి.

గీ. అట్లుచెడి హీనులై స్వకీయార్య మతము
మహిమ మఱచి యనేక దుర్మతములఁగాని
నైకమత్యము లేక కొట్లాడుకొనుచుఁ
బ్రభువులు నశింపఁ బాడైరి పలువిధముల. 114

గీ. ఇట్లుచెడి హీనులయ్యును నిది కలియుగ
మనుకొని మఱియుఁ జెడుచుండిరకట? యిర
యఁ "కృషితోనాస్తి దుర్భిక్ష" మనెడు పరమ
మౌనివాక్యరత్నము వీరు మఱచిరొక్కొ. 115

గీ. స్త్రీనిఁగూడితపముమౌనిహీనులైన, యీప్రజలుమఱియుఁ జెడఁగనిప్పటికవి
వరులుబూతుకవిత్వముల్ వదలలేదు, హిందుదేశము దౌర్భాగ్యమిట్టులుండె

—సకలజనకర్తవ్యము—

క. కానఁగ వివరులమల, జ్ఞానప్రదకృతులు సేయ సమ్మతిపడినన్
మానవులారోగ్యగమ, మౌనివచోరీతినున్న మఱలసుఖముగన్. 117

—పాపరాజ హీనదశా ప్రారంభము—

క. ఆరతినివేశ్యాప్రియుఁ, డైరాజిలుపాపరాజు నాఁడుదురుజనుల్
క్రూరాత్ముఁడుపాపాత్ముఁడు, ఘోరాత్ముఁడు వీనిఁదాఁక గూడదటంచున్

గీ. అట్లుండియాపాపరాజాగణికకు, హెచ్చుధనమిచ్చుచునుసింక నీయననుచు
నుండలేకయిచ్చుచునిట్టులున్నదెల్ల, నిచ్చెవ్యసనమేదైనను నిట్టిదెగద ! 119

గీ. అట్టులావారకాంతమాన్యములునిల్లుఁ, గూడఁదనపేర వ్రాయించుకొనియతనికిఁ
దనగృహంబులోనేకొన్నిదినములవఱ, కన్నమును బెట్టిపోషించి యాదరించె

గీ. ఆవిధమునఁగులభ్రష్టుఁడైనవాని, నెల్లవారును వెలివేసి హీనునివలెఁ
జూచుచుండిరి, పాపపుసొమ్ముపోయి, నట్టిగతిచూచితిరె? యోమహర్షులార. 121

—పాపధనలక్షణము—

క. ఆటలకునువేఁటలకును, బాటలకును లంజయింటిబాటలకును బూఁ
దోఁటలకును జోటులకును, నీటులకును గర్వపడును నీచధనంబుల్. 122

క. పిట్టలకును బట్టలకును, జుట్టలకును దాగుఁబోతు చుట్టంబులకున్
రొట్టెలకును బెట్టెలకును, గట్టెలకును గర్చుపడును ఖలజనధనముల్. 123

క. ఫేనిలఫలడిండీరము, హీనాసక్తిం దినెడి మహీలతభంగిన్
హీనములగు భోగంబులె, హీనాత్ములు గోరుదురు మహీతలమందున్. 124

సీ. సకలోపకారక సత్కార్యమొకటైన నెలమితో నచ్చువేయింపలేదు
జపతపంబులఁ బ్రజ కుపకారమును జేయు విప్రులకన్నంబు పెట్టలేదు
భక్తిమార్గము వృద్ధిపఱచెడి దేవాలయంబు ప్రతిష్ఠఁ జేయుంగ లేదు
బాటసారుల శ్రమ పరిహారమును జేసి చెలయునూయైనఁ ద్రవ్వింపలేదు

గీ. చివరకొకయాచకుని బట్టి చెంగులోన నైన నొక్కరూకయ్యు పుగింజయైన వేయ
లేదు, వెలయాలికంతె యీ లేదనకయె, పాపధనమెల్ల నిడినాఁడు పాపరాజు.

మ. సతతస్త్రీరతిచేత దుర్బలుఁడు, వేశ్యాసంగతిన్ రోగియుం
గతరూపుండు, సధర్ముఁడౌటను బ్రజా గర్హ్యుండు, నిర్భాగ్యతన్
మతిలేకుండిన వాఁడు, నానతని దుర్మార్గంబుగా వేశ్య "నీ
గతియింతే" యనితోత్తె నిష్కరుణతోఁ గౌపీనపుంగుడ్డతోన్. 126

క. మందులతోడబ్బుటచే, మందులతోడబ్బు సుఖము మానినవిటులా
మందులతోడగు గతినేమందు? లతోర్వంగి వేశ్య యంటటు సేసెన్. 127

వ. అంత గోరుచుట్టుపైని రోఁకటిపోటు సామెతగాఁ దత్పాపరాజు దౌర్భాగ్య
మోయనునట్లు దురంతదుర్దాంత సంతాపసంతత సంతాపిత సకలాశాంతమ
గు వసంతానంతర కాలమే తెంచి యనంత ప్రభావంబు సూపం దొడంగె.

—గ్రీష్మర్తువర్ణనము—

క. పగటుసూర్యప్రతాపంబువలనఁ జూడ, రాత్రినుక్క చేనిల్వఁ దరంబుగాక
యఖిలలోకజాలమునకు నాదిభూత, మయ్యె నాదిభూతంబైన యట్టిమిన్ను.

గీ. ఉడుకుచేఁ దాపమును బొంది యూర్ధ్వముగను
శ్వాసము విడుచు త్రాచు విసంబు గలిసి
మలయమారుతము విలయమారుతమయి
యఖిలజనులకు బాధక మగుచుఁ దోఁచె. 129

సీ. పగటబయటికేగి పనులొనర్పక యుండ గాఢోష్ణమైమండు గాడుపగుచు
సంధ్యాసమయమున సావడుతఱిదీపికల నార్పగా సుడిగాలియగుచు
నిశయందు సుఖముగా నిద్రింపవీలుగాకుండ రూపము మాఱియుక్కయగుచుఁ
దెల్లవాఱునపుడు తెలిసిలేవఁగవీలుగాకుండఁ గడుచల్లగాలి యగుచుఁ
గీ. బుడమియందు సర్వాధార భూతమైన, గాలియే యిట్లు శత్రువై గాఢమై స
ద్రశమము పెట్టుచున్నది, యింకఁ బ్రాణితతుల కెట్టుతిన్న యన్నము మేనఁబట్టునకట!
సీ. సూఁడు వెడలి రాఁగ గుప్పున కొక్కెలు గాల్చి పక్షులనట్లె క్రాల్చివైచి
గడ్డియు నీళ్ళును గలుగకుండఁగఁ జేసి పశుజాతములు బాధ పడఁగఁ జేసి
బయటికేతెఱచైన వచ్చెడుపురుషుల మలమలమాడ్చి భస్మంబుచేసి
యేమైనఁ బని సేయ నిల్లు వెడలి రాఁగ నఖిలజనంబుల నడ్డుపఱచి
గీ. సూర్యరూపంబు గైకొని శోభగాంచు, నగ్నిసంపూర్ణ యౌవనమందిరేగి
ప్రాణికంటకమై యిండ్లు వనములు మొద,లైనవానిని మృత్యువై యణఁచుచుండె.
గీ. సగముకాలిన చిదుగులు సంగ్రహించి, కాకులిండ్లపైఁ బెట్ట నాకట్టెలఁగల
యగ్ని చేనిండ్లుగాల సూర్యకిరణముల, నగ్ని పుట్టినదనుచుండిర హాహా! జనులు.
చ. తనప్రియభోగ భామిని శతక్రతుదిక్సతియౌవ కాయదా
నొనరెడు నిచ్చఁబెట్టుకొనుచున్న తఱిం జని వాలుక్రియూనఁగా
ఘనముద మందుచున్ సగముకారము దాఁక భుజించి వచ్చెనో
యనరవియాత్మ తీవ్రరుచి యౌవనుగల్పినయట్లు పేరిచెన్. 133
గీ. దాహమాను దీర్పు నెపముచేఁ దరుణమందుఁ
బరమమిత్రునివలెఁ గానఁబడుచు లోన
నమరు శీతమునకు సహాయమయి నీరు
చల్లచల్లగా దిగ గర్భశత్రువయ్యె. 134
ఆ. అడుగుపెట్టఁగానె యఱకాలి మంటను, నెత్తికెక్కఁజేసి మిత్తియగుచు
నెట్టిసస్యఫలము నీయకభూమియు, బాధపెట్టుచుండెఁ బ్రాణితతుల. 135
సీ. ఉర్వియట్లు పెనంబయ్యె, నుదకము చము రయ్యె, మిను వేఁడిమంగలంబయ్యె, గాలి
పొగపుఁబొగరయ్యె, రవి గాడిపొయ్యియయ్యె, నయ్యయో! జగమికఁ వేగకాఁగఁగలదె
వ. ఇట్లు పంచభూతంబులును మహాఘోరాకారంబులగుటంజేసి యొక్కమంతు వేసవి భయంకర ప్రళయకాలంబువలెనుండె. 136

ఉ. కాలము కందుసూర్యుఁడను కంటికి విప్పి లయంబు సేయుచో
మేలిమిదివ్యమూర్తులయి మింటఁ జెలింగెడు దేవమానుల
ట్లాలయసౌఖ్యముల్ గను ధనాఢ్యులఁ గూడఁగలంచెఁ గొంత త
న్నీలగళస్ఫురత్పరత తేళ్లయి జెట్టులు దోమనల్లులై. 137

చ. పడమటినుండి వచ్చెనను వచ్చెడు గాడ్పున కోర్వక య్యనూ
రుఁడు పెడమోము పెట్టుకొని రోయుచు నుండ జెమటూర్చుకొంచుఁ ద
త్తములను నోల్కుటన్ రవిరథంబు జలేశదిగద్రికిం జనం
దడవగుచుండెఁ గొంత యతిదారుణమై తగునట్టి వేసవిన్. 138

గీ. చెమట తనువున నింకినఁ జేటు వచ్చు
ననియొ యిుఁగక చల్లగ నుండు నని కడు భ్రమ
పడుచుఁ గొందఱు చొక్కాలు దొడుగుచుండి
రదియెయొక గొప్పలౌకిక మనుకొనుచును.

గీ ఎప్పుడుఁగాన్పింపఁగడుగని హీనులుకడు, కాగలేక నిత్యస్నానములైరియప్పుడు
దెబ్బఁ దగిలినప్పుడుగ దా దివ్యమునుఁ, మత ముకుడుకుంది దైయొపుణ్యమందులకును.

సీ క్షుత్పిపాసలుదీర సుఖమును బొందంగ లలితంబులైన ఫలంబులిచ్చి
యాయాసమెల్లను హరియింపశయినింపఁ, దమయొద్ది నున్న నిస్థల మొసంగి
యొండవగులకుండ నెంతొదట్టంబైన తమనీడయనెడు ఛత్త్రంబుపట్టి
చక్కఁగా నిద్రింపఁ జల్లఁగానుండంగ నాకువీవనలచే నమరవిసరి

గీ. వృక్షరాజరాజులు కల్పవృక్షములన, వెలసితా మెండలోననే నిలిచి బాట
సారులకతిథిపూజలు సలుపుచుండెఁ, బరమలోభి ప్రజలు సిగ్గువడ యనపుడు.

— పాపరాజాంత్యదశ —

సీ. బహువిధ బాధల పాలుగాఁ జేసి బ్రాహ్మణభూములు చెఱచినట్టియఘముఁ
గరుణయింతయులేక కడుబీదలనుఁ బంధమున కతిబాధపెట్టినయఘంబుఁ
దన్నునమ్మినరాజు తాళంబుపట్టి ద్రోహము చేసి చెఱచినయట్టియఘము
వైష్ణవు సేవ్పించి వానికాఁపురమును నట్టేటఁగలిపినయట్టియఘము

గీ. సతతము లాచార బాహ్యుఁడై సంకరుఁడయి
యాపనిమార్గదర్శకుఁడుగానట్టి యఘము

నాకక్రసారె పరిణమించి యుక్రమించి
పటుభయంకర దుర్దశాప్రాప్తినొసఁగ. 143

సీ. అరఁటిచొరుగువలె నాఁటిదట్టంబైన కఱ్ఱిళ్ళగుడ్డను బుట్టఁగోఁచిపెట్టి
మూఁడుజానలుగల ముదుగైనయొకకఱ్ఱ ముక్కనెడమచంకనాక్రపట్టి
బాటసారులు పాఱవైచినయొకచుట్ట పీఁకెనుగుడిచెవి పైకిఁజేర్చి
పెంటమీఁదనుబాఱవేసిన యొకపాఁత చిల్లికుండ నెడమచేతఁగూర్చి

గీ. పాదుజబ్బులచేఁ గాళ్ళు పడఁగ లేక,
చెండకోర్వకమ్మాయని యేడ్చుచుఁ, గుడి
చేత భూమిఁబనుకొనుచు, సిగ్గులేక,
బిచ్చమెత్తుకొంచుండెఁ, బాపిష్ఠుఁడగుచు. 144

గీ. అట్లుచావఁగాసిద్ధమైనపుడుఁగూఁకఁ, జల్లిదండ్రులందలఁచి బాధపడుఁగాని
రామ! రామా! యనఁగజిహ్వరాకయుండె, వానికడయెన్ని జన్మాలపాపమొక్కో?

గీ. ఇతఁడుచేసిన ద్రోహములెల్లఁదలఁచి, పట్టెఁడన్నమునెవరును బెట్టకుండి
రెవ్వరైనఁబెట్టినదానినెగురఁడన్ని, కొనుచుఁబోవుఁగాకులదెంత గొప్పచేటొ?

గీ. ఇట్లుచావులేకదురితమెల్లఁదినుచు, బాధపడుచుండె దుష్టుఁడా పాపరాజు
మౌనులార! యత్యుత్కటమైనపుణ్య, పాపములిటులిహమందె ఫలమునిచ్చు

——కథాఫలశ్రుతి——

క. కావుననరులితనికథా, భావము బాగుగనెఱింగి పాపపురీతిం
బోవకపుణ్యముచేసినఁ, గైవల్యపదంబునొంది కాంతురుసుఖముల్. 148

——వివేకానందచరిత్ర——

సీ. కామహరిశ్చంద్రి కౌశికుండురుకోప భూపవిశ్వామిత్రి మునివసిష్ఠుఁ
డతిలోభకార్తవీర్యార్జున భృగురాముఁ డురుమోహ భృగురామధరణిజేశుఁ
డతిమదవృత్రారిసు రామరనాథుండు, గాఢమత్సరవజ్రి కలశజన్ముఁ
డజ్ఞానజైమిని ప్రజ్ఞాఢ్యబుద్ధుండు చాచంల్యచార్వాక శంకరుండు

గీ. బ్రహ్మరూప సుమత్యంశ భవుఁడు, మోహి
నీసుతుఁడు, వివేకానంద నిస్తులాఖ్యుఁ
డచట బళ్ళారిపురిని విద్యాళిసార
మరసిప్రహ్లాద భవనార దాఖ్యుఁడయ్యె. 149

వ. ఆబాలభాగవతశ్రేష్ఠుండనేక జన్మాంతరానంత సుకృతపరిపాక సంప్రాప్త సహజవైరాగ్యంబునంజేసి మనంబుపూనక బ్రహ్మచర్య నిష్ఠం బరఁగఁగలి ప్రపంచమున దేరిచూచి విచారించి సంఘసంస్కరణాభిలాషుండయి "బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్" యను బృహదారణ్యవాక్యమును "రాతినాసం భాష్యయథార్థంగచ్ఛతి" యను నాపస్తంబసూత్రమును జూచి గృహస్థాశ్రమము వైకల్పికమనియు "నపుత్రస్య గతిర్నాస్తి" యనునది గృహస్థధర్మమనియు నిశ్చయించి, దానిచేవచ్చిన సృష్టిభంగశంకను కృతత్రేతాద్వాపరంబులలోఁ బురుషులస్మరణ దర్శనస్పర్శనములవల్ల స్త్రీలకు గర్భమయ్యెడిదనియు, ద్రౌపద్యాదులుకొందఱు మంత్రశక్తిచే హోమకుండములోఁ బుట్టిరనియు, విశ్వామిత్రాదులు సంకల్పమువల్లనే సకలవిధసృష్టి చేసిరనియు నిట్లుగల పురాణవాక్యములవల్లను, సకలప్రపంచమును మనస్సునందే సృష్టిస్థితిలయములను బొందుచున్నదను వేదాంతశాస్త్రసారాంశముచేతను సృష్ట్యాదినిస్వాయంభువమనువువఱకు జరిగినది స్త్రీరహిత సృష్టియని కలప్రసిద్ధిచేతను నివృత్తి చేసికొని శుక్ల శోణిత మల సంభవసృష్టికంటె నుత్తమతపస్సంభూత మనోబలమువల్లఁ జేయు సృష్టివిశేషాయుర్బలకాంతులుగల్గియుండుననియెఱింగి, సృష్టికి సంగమము ప్రధానము గాకున్నయెడల దానికి గ్రామ్యధర్మమను పేరే యుండదనియు నిశ్చయించి బ్రహ్మచర్యాశ్రమమునుండియే విధ్యుక్తముగా సన్యసించి, యుత్తమయోగ సాధకముచే నూర్ధ్వరేతస్కుండయి, యకామచారుండగుటవలనం బ్రాయశ్చిత్తరహితుండయి, శంకరాచార్యునివలెఁ గలియుగసన్యాస నిషేధనిషేధుండయి, పరిపూర్ణవీర్య స్తంభనంబుచేఁ గలిగినయుత్తమబ్రహ్మతేజస్సును జూచి మోహించి తమ్ముఁ బెండ్లాడుమని కోరిన యనేక మహాభాగ్యస్త్రీలను మాతృభావంబునం జూచుటంజేసి యులిగిందల సన్యాసులను సిగ్గుపఱచుచు మొదటఁ బ్రహ్మానందప్రభువును దర్శించి యచ్చటఁ గొన్నిమాసములుండి సంకరపురిని సంస్కరించి శంకరపురియను నామంబుపెట్టి యాప్రభు ధనసహాయముచేఁ బ్రపంచసంచారము గావించుచు నతిగంభీర వాక్ప్రవాహముచే నార్యమత భూమింబరిశుద్ధంజేయుచు నడుమవచ్చిన దుర్మతవృక్షంబులను మూలముట్టుగఁ బెల్లగించి చాఁపచుట్టుగఁ బడఁద్రోయుచు మహర్షిశాసనప్రకారముగా ధర్మరక్షణంబు సేయుచుండె. ఓశౌనకాది మహర్షిశ్రే

ష్ఠులారా! కలియుగమునందింకఁ గొన్నిశతాబ్దంబులు గడచినకాలంబున నేను జెప్పినరీతిగా సహజపావన జ్ఞానంబునంబ్రకాశించు సుమతీబ్రహ్మానంద వివేకానందులచేతను, బశ్చాత్తప్తయగు మోహినీకాంతచేతను వేదశాస్త్రపురాణమతము రక్షింపఁబడఁగలదు. ఇది యంతయు మదీయ దివ్యదృష్టిం జేసి స్పష్టముగా నేనుగాంచి యిపుడు వరలోవలెనే జరిగినకథవలె మీకుఁజెప్పితిని. ఈవేదమత మిట్లనేకాపదలనొందుచు భక్తవర్యులచే రక్షింపఁబడుచుఁ గలియుగాంతమునకు బీజభూతంబై నిలిచి కృతయుగంబున మఱల యథాపూర్వప్రకారముగా విజృంభింపఁగలదు. భవిష్యత్కాల శుభకారణములైన యాగాది సత్కర్మములు సేయు[illegible]టకుఁ గలిప్రజలసమర్థులగుటచే మీదీర్ఘ సత్రయాగము కర్తలరయే యాకాలాంత దీర్పుటకుఁ [illegible]ను. ఇట్టి లోకోపకార కార్యంబున మీరును శ్రీహరిదయకుఁ బాత్రులయిరి. 150

—ఫలశ్రుతి—

క. సకలానందదమగునీ, సకలానంద ప్రబంధసారస్యంబుం
బ్రకటమతి నెఱుఁగునాతఁడు, సకలానందంబులంది సద్గతివడయున్. 151

సీ. బాలుండు వృద్ధునివలె నెఱుంగును వృద్ధు బాలునట్లు పవిత్రవర్తనుఁడగు
స్త్రీ పురుషువలె వ్యాప్తిసిరతగాంచును బురుషుఁడు స్త్రీ చతుర్గుణ సుమతిగాంచు
బాషండుఁడార్యుఁడై పరఁగునార్యుండు పాషండతుల్యుండన సన్యసించు
నజ్ఞానిసుజ్ఞానియగును సుజ్ఞానియజ్ఞానియై మోక్షరాజ్యంబు నేలు

గీ. లౌకికుఁడు వైదికుని విమలత్వమందు, వైదికుఁడు లౌకికు కుశలత్వంబునందు
నతులమగు సకలానందకృతినివ్రాయఁ, గన్ననన్నను, విన్నను, గన్నవెన్న.

సీ. పతియు సంతానంబు భ్రష్టులైయున్నను సుమతినెయ్యది పూర్ణసుమతిఁ జేసె
సకలసంసారంబు వికలమైచనిన మోహినినేది మోక్షమోహినిని జేసె
నతిబాలుడఁగు వివేకానందవిదుని నెయ్యది వివేకానంద విదునిఁ జేసె
నతిరాజ్యమదుని బ్రహ్మానందమేశుని నేదిబ్రహ్మానందమేశుఁ జేసె

గీ. నాసదానందమే సకలాంచితమయి, శాశ్వతయశమై శ్రీరామసత్కృతియయి
నిరుపమానమై తగదాని నిందలఁగొను, శ్రీమతులు సకలానంద సిద్ధిగవరె? 153

సీ. మూఢరాజనుభూమిపుండతిపాపరాజై చావదుర్గతిఁ బైచెనేది ?
పాపరాజనుమంత్రి పతియతిమూఢరాజై హీనదశనొందఁ దలఁచెనేది ?

పాపరాజసుతులు బలునవాచారాతి బలులైచెడఁగ సిగ్గుపడఁజేసెనేది ?
బలునవాచారాతి బలులతిపాపరాజ సుతులైచితింప నలిపెనేది ?

గీ. యానదానందమే సకలాంచితమయి, శాశ్వతయశమై శ్రీరామసత్కృతియయి
నిరుపమానమైతగదానినిందలఁగాను, శ్రీమతులు సకలానంద సిద్ధిఁగంద్రె?

క. సకలాచ్ఛముక్తిసాధిత, సకలాశ్రమవర్ణధర్మ సకలార్చితమై
సకలానందసుకావ్యము, సకలానందంబులీదె? సకలాదిమమై. 155

క. అనవినిశౌనకముఖ్యులి ట్లనిరో సూతా! సుకృతమహాంహోరీతుల్
వినిపించితివన్ని యుఁద్భ, క్కినగనెమది; యింకలేవ్ప వినఁగ గుణనీతుల్. 156

—నిందాపూర్వక నీతిబోధచర్చ—

గీ. ఒకసందేహమిపుడు మాకుదయమయ్యె, నిందసేయుచుఁ జెప్పితి నీవునీతి
యిట్టినీచుబోధమువిననేల? యంచు, నెల్లరునునిన్నుఁదిట్టుదు రేమొ జనులు.157

క. అనగావినిసూతుఁడి, ట్లనియెన్ మునులార ! మీకహార్నిశలమహా
ఘనగాథలనేకంబులు, వినిపించితినందుఁదిట్టు విధములుగలవే ? 158

వ. నేనువినిపించిన పురాణకాలములోని జనులు సాము దాయక ధర్మముచేత విశే
షనీతివర్తనులయి యుండెడివారు. కావున నప్పటికెందనినట్లుత్తమ బహ్మ
జ్ఞానాదినీతులు చెప్పితిని భవిష్యత్తుననశక్తులయి దుష్కృత్యములు సేయుదురు
గనుక వారిపనులలోనికీడును నెల్లడించి దేశకాలపాత్రానుసారముగా ధర్మము
లు చెప్పితిని. మహర్షిసంతతి వారగుటచే మనకు సహోదరులును కుమారు
లును నయిన యార్యులను నిందించిన నాకేమిలాభము ?

క. సత్యముగా శ్రీమునులయ, పత్యమునం దేజనించి భారతమాతన్
నిత్యముగాలిచెడునార్యుఁడు, సత్యముగనకున్నె? నాదుసద్వాక్యములన్.160

—క్షేమాభిజనకకర్తవ్యము—

శ్లో. సులభాః పురుషాలోకే, సతతం ప్రియవాదినః
అప్రియస్యచపథ్యస్య, వక్తాశ్రోతాచ దుర్లభః.

గీ. ఎంతచెడుపనిఁచేసిన నీవెగొప్ప, వాఁడవని ముఖప్రీతిగాఁబలుకువారు
సులభులిదినీకుఁ తగదనిపలుకువారు, దానివినువారు దుర్లభుల్ ధరనియందు.

ఉ. కావున శాంతచిత్తుఁ డయి కామముఁ గ్రోధముఁ జంపివేసి త
న్నేనరుఁ డైనఁ దిట్టునెడ నియ్యది నాయభివృద్ధిహేతు వే
గాని శుభంబుమాన్పునది గాదనుచుందన కున్న లోపము
మానుటకుం బ్రియత్నపడు మానవుఁడే సుఖవంతుఁడౌ భువిన్. 162

ఆ. అల్పజనుఁడు తిట్టు టదొక లెక్కయెగాదు, ఘనునితిట్టునీతిగఁ దలఁపవలె
దిట్టునట్టివానిఁ దీవ్రకోపంబేఁచుఁ, బడ్డవాఁడు చెడ్డవాఁడుగాఁడు. 163

క. తనబాగుగోరి "గోళీ, లనాడక చదువుకొను" మని లాలించుచుఁ జె
ప్పినతండ్రిమాటనువినని, తనయుఁడుచెడి పోవుగాని ధన్యుం డగునే? 164

— సంయమిప్రాయశ్చిత్తము. —

వ. కావున నావిషయంబున మనము సందేహింపవలసినపని లేదు. అయినను వా
జ్ఞియమనుగలవారగుటచే సంయమినామము ధరించిన మనకు మనపుత్రులకు
హితోపదేశము సేయుమార్గము గా నైనను బరనిందాకృత్య మొకింత సంభవిం
చినది గనుక సకలపాపనాశనకరంబైన గోవిందనామస్మరణము సేయుదమ
ని యతండును శౌనకాదులును గలసి బాహువులు పైకెత్తి కన్నులు మూసికొని
భక్తిపరవశులైయిట్లు స్మరణగావించిరి. 165

— గోవిందాష్టకము.-

క. వందారుసనందనముఖ, బృందారకమౌనినాథహృదయనివాసా
నందా? పావనసేవక, బృందార్చ్యపదారవింద శ్రీగోవిందా. 166

క. అరుణాంబుజనేత్రద్వయ, తరుణాంబుజచరణ శత్రుదారణ భాస్వ
త్కరుణా వరుణాలయ శ్రీ,వరుణాద్యర్చిత ముకుంద వరగోవిందా. 167

క. శారద నీరద నారద, పారదహారదరహీర భాసురకీర్తీ
వారణ వారణ వారణ, మారణ కారణసుశక్తిమయ గోవిందా. 168

క. ఉరుపీతాంబర చపలా, హరిచాప దరస్తనితవరామృతవర్షా
విరతావిత నతచాతక, పరమోజ్జ్వలగాత్రకంద వరగోవిందా. 169

క. వరవాగాశ్రితకీరా, విరతఫలద బాహుకల్పవృక్షా! విమలాం
బరగంగామకరంద, స్ఫురదంఘ్రిపయోరుహా! జిత ముర! గోవిందా. 170

క. అలకాళిస్ఫురదానన, జలజా! యసిచాపశంఖచక్రగదాద్యు
జ్జ్వలలాంఛనకర! మృదులా,మలభోగశయన! త్రివిక్రమా గోవిందా. 171

క. అనయాజామిళరక్షక, ఘనరాజ! కుచేలపోషక త్యాగివరా!
అనుపబలిదర్పకపా, వనభక్తత్రాణదీక్ష! వరగోవిందా. 172

క. యమభటభీకరనామా! యమితభవాంభోనిధి ప్లవాయితచరితా!
సుమనోనాయకసామ్రా, జ్యమహాలాభప్రదపద! హరి! గోవిందా

—సూతశౌనకాదిబ్రహ్మలోకవాసము—

వ. ఇట్లుస్మరించి.

క. సంతతసద్బోధకరుదు, శాంతులగు కలిజనములకు దర్శనమీఁగా
నెంతయ్యునొల్లక మునివరు, లింతకుమును దెయటకేగ నెఱిఁగినవారై.

వ. తాము నైమిశారణ్యమునుండి లేచి మేరుపర్వతోపరిభాగ భాసితంబును, వాయుగోళాంతరస్థ సూక్ష్మప్రపంచప్రకాశితంబును దివ్యతపస్సంప్రాప్త పూర్ణ మనోబలసంపన్న దృష్టిగోచరంబును, సకలదేవాలయగోపురంబును నగు బ్రహ్మలోకంబున ననుజని మంజులతాయోగ కణికాశోభిత, యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణసమాధి నామాష్టదళ విరాజిత, నిశ్శేషకళ్యాణగుణ గణాఖండపరిపూర్ణ సచ్చిదానంద పరబ్రహ్మమూర్తి కమలాక్షుద్విరేఫాంచిత సుఖాసనికముఖులయి, యా పరమహంసలు పరమహంసలయియుండిరి. అప్పటినుండియు భూలోకము మహర్షిసంచారశూన్యంబగుటచేఁ గేవల సత్త్వమాత్రగోచరములయిన యార్యమతవిషయములకు దృష్టాంతము చూపించువారు లేక సూతుండీగ్రంథంబునం జెప్పిన భవిష్యత్కాలచర్యలు పుట్టిపెరుంగం దొడంగె.

అష్టదళపద్మబంధము—

పరిగ్రహిత తారకాదీక్షితా! తారకపత్రాశ్రితా!
తారకాధ్వస్థితా! తానాక్యాదృతా!
తారకకీర్త్యంచితా! తాడితేంద్రాహితా!
తారకాఖ్యాన్వితా! తాపసారాధితా.

గద్య.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర, కౌండిన్యసగోత్రపవిత్ర, ముత్యసంతానక్షీరపారావారరాత్రిపుత్ర వేంకయ్యార్య ద్వితీయపుత్ర, బాపన్నార్యపౌత్ర, చినపర్వయ్యార్యైకాదశాబ్దపోషితపుత్ర, సీతయ్యార్యస్వీకృతపుత్ర, సకలజన కారుణ్యాకటాక్షపాత్ర, సీతారామచంద్ర పరబ్రహ్మార్పిత సకలకర్మ, సూర్యనారాయణమూర్తిశర్మ ప్రణీతంబై, యపూర్వాద్భుత చరిత్రయగు సకలానంద నామక నవీన ప్రబంధమునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

శ్రీసీతారామచంద్ర పరబ్రహ్మార్పణమగుఁగావుత.